REGD. No. GNL 18 — ESTD. 1930 — 9.8.1991 శుక్రవారం రు. 1-50 లు

# జమీన్ రైతు



సంపుటి: 62 సంచిక 32 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్

# సామ, దాన దశ ముగిసింది- దండోపాయమే మిగిలింది!

ఎప్పుడా, ఎప్పుడా అని ఎమ్మెల్యేలు కలవరిస్తుండిన రాష్ట్రమంత్రివర్గ విస్తరణ జరిగిపోయింది, 31 మంది కొత్తమంత్రులు ప్రమాణస్వీకారం చేశారు. దీనితో మొత్తం మంత్రులసంఖ్య 88 కి పెరిగింది. ఆలస్యాలేమీ లేకుండా ఆరోజునరోజే శాఖల కేటాయింపు చేసేశారు ముఖ్యమంత్రి.

అసమ్మతి ఉద్యమ ప్రకటన చేసిన వారిపైన సామదానోపాయాలు ప్రయోగించేదశ ఇంతటితో పరిసమాప్తమైనట్లు లెక్క. మంత్రివర్గ విస్తరణలో అన్ని వర్గాలనూ సామరస్యపూర్వకంగా తనతో కలుపుకుపోయేందుకే శ్రీ జనార్దనరెడ్డి ప్రయత్నించారు. అందువల్లే చెన్నారెడ్డి రాజశేఖరరెడ్డి, విజయభాస్కరరెడ్డిలను లిస్టులు అడిగారు. రాజశేఖరరెడ్డి ఈ దానోపాయానికి ప్రతిస్పందించలేదు. లిస్టు యివ్వడానికి నిరాకరించారు. చెన్నారెడ్డి గారు పన్నెండుపేర్లు పంపారు అందులో ఆరుగురిని జనార్దనరెడ్డి తనమంత్రివర్గంలోకి తీసుకున్నారు. విజయభాస్కరరెడ్డి అనుచరులలో నలుగురికి స్థానం దొరికింది. ప్రధాని శ్రీ పి.వి. కుమారుడు శ్రీ పి.వి. రంగారావు మంత్రి అయినారు.

**మంత్రివర్గ విస్తరణ తర్వాతకూడా చెన్నా, వైఎస్‌లు కినుకమానలేదు!**

ఈ విధంగా పంపక పోవడంద్వారా రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిపై అసమ్మతి యుద్ధం కొనసాగించదలచినట్లు నిర్ణయించు కున్నట్లు తేలిపోయింది. అసెంబ్లీ సమావేశాలలో ఆయన తన బలప్రదర్శన చేయబోతారు. ఈ దాడిని ప్రతిఘటించడానికి జనార్దనరెడ్డి సైతం సిద్ధంగానే వున్నాడు. ఇప్పటివరకు నడిచిన సామ, దాన మార్గాలు విఫలమైనాది. దండోపాయ మవలంబించడం ఆయనకు తప్పనిసరి. ఒకటికి ఆరుపదవులు పొందిన చెన్నారెడ్డి గారు సైతం 'ఎమ్మెల్యేల ఫోరం' ద్వారా జనార్దనరెడ్డిని దెబ్బతీసేందుకు కృషి చేస్తున్నాడు. ముఖ్యమంత్రి తనవర్గాన్ని మంచితనంతో గట్టిచేసుకొని, ప్రత్యర్థి వర్గంగా తేలినవారిని కఠినంగా అణచివేసేందుకు ప్రయత్నమారంభించకుంటే, అసమ్మతి న్యూసెన్స్ వెన్నంటేవుంటుంది.

### అలకపాన్పులు

మంత్రివర్గ విస్తరణలో స్థానంపొందిన పలువురు, అప్పుడే అలకపాన్పులెక్కారు. చెన్నారెడ్డి కోటాలో మంత్రి అయిన సమర

—కొరవ 8 పేజీలో

# చరిత్రాత్మకం కానున్న 'జమీన్ రైతు' వజ్రోత్సవం



ఆరు దశాబ్దాలు తెలుగు పాఠక లోకానికి ఫలప్రదమైన సేవచేసిన "జమీన్ రైతు", వజ్రోత్సవం జరుపుకోబోతుంది. చిన్న పత్రికల చరిత్రలో మహోజ్జ్వలమైన ఈ సంఘటనను చరిత్రాత్మకమైనదిగా తీర్చిదిద్దాలని మా సంకల్పం. చిన్నపత్రికకు వున్న ఈ పెద్దకోరిక నెరవేరడానికి ఇంత ఆలస్యం అనివార్యమైంది.

భారత రాష్ట్రపతి గౌరవనీయులు డాక్టర్ ఆర్. వెంకట్రామన్ ఈ వజ్రోత్సవాలలో పాలుపంచుకోబోతున్నారని తెల్పడానికి గర్వపడుతున్నాము. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి నేతృత్వంలో జరుగబోయే ఈ బంగారు పండుగలో జమీన్ రైతుకు ఆప్తులు, ఆత్మీయులు అయిన శ్రీ ఎన్.జి. రంగా, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి పాల్గొంటారు. 29 తేది పగలు, కస్తూరిబా కళాక్షేత్రంలో ఈ మహోత్సవం జరుగుతుంది,

అరవయ్యేళ్ళపాటు జమీన్ రైతును ఆదరించి, అభిమానించిన సింహపురీయులందరి పండుగ ఇది. మా ఆనందంలో అందరూ పాలు పంచుకోవాలని, స్వంత పండుగగా భావించి విచ్చేయాలని ఆహ్వానిస్తున్నాము



మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తున్న శ్రీ మాదాల జానకిరాం

# జానకిరాం అసాధ్యుడనిపించాడు

ఉదయగిరి శాసనసభ్యుడు శ్రీ మాదాల జానకిరాం నూతన మంత్రివర్గంలో స్థానం సంపాదించాడు. గనులు, భూగర్భశాఖ సహాయమంత్రిగా 8 తేది సాయంత్రం పదవీ ప్రమాణం చేశాడు. జిల్లాలో తన కంటే సీనియర్లు, తనకంటే ముఖ్యమంత్రికి సన్నిహితులు, సన్నిహితులైన ఎమ్మెల్యేలెందరోవున్నప్పటికీ, వారు ఎవరూ సాధించలేనిది సాధించి, అసాధ్యుడ్నని నిరూపించుకున్నాడు. ఎమ్మెల్యేగా ఎన్నికైన తొలిసారే ప్రమోషన్ పొందాడు.

చెన్నారెడ్డి హయాంలో అసమ్మతి శిబిరానికి 'స్పోక్స్‌మన్'గా అంగంచేసిన జానకిరాంకు, కొత్తప్రభుత్వంలో సముచిత స్థానం ఖాయం అని అందరూ అనుకున్నదే; కాని, గతంలో జనార్దనరెడ్డిని వ్యక్తిగతంగా, రాజకీయంగా దెబ్బతీసిన తీరు తెలిసినవారు మాత్రం సందేహించారు. జీవం రాజశేఖరరెడ్డి పోషించిన అసమ్మతి ఉద్యమంలో పాలుపంచుకోకుండా, ముఖ్యమంత్రి పక్షాన నిలకడగా నిలబడడం జానకిరాంకు మార్గం సుగమం చేసినట్లుంది.

జనార్దనరెడ్డికి అంతరంగికులైన ఎమ్మెల్యేలు పలువురికీ కూడా జానకిరాంకు మంత్రిపదవి ఇవ్వడం ఇష్టం లేదు. సహజంగా [illegible] కావడంతో, ఎప్పుడో ఒకప్పుడు ప్రతి రాజకీయవాదినీ ఏదో ఒక మాట అని, నొప్పించడం జానకిరాం నైజం. ఆ వాగ్బాణాల బాధితులైన ఎమ్మెల్యేలు పలువురు - ఆఖరినిమిషంవరకు ముఖ్యమంత్రిపై వత్తిడితెచ్చారు - పదవి ఇవ్వవద్దని! ఇంటలిజెన్స్ డిఐజి శ్రీ [illegible] ఆంజనేయ రెడ్డి అయితే, రాజభవనానికి పోవడానికి కారెక్కబోతున్న సమయంలోనూ ముఖ్యమంత్రిని "పరోక్షసాయం ఆలోచించుకోమని" సలహాయిచ్చాడట. ఎందరెన్ని రకాలుగా చెప్పినా, జనార్దనరెడ్డిగారు మాత్రం జానకిరాంకు ఇచ్చినమాట నిలబెట్టుకున్నారు. రేపు అసెంబ్లీలో రాజశేఖరరెడ్డి వర్గీయులు ప్రారంభించబోయే దాడిని ప్రతిఘటించడానికి సైన్యాధిపత్యం వహించడంద్వారా ముఖ్యమంత్రి ఋణం తీర్చుకోవడం జానకిరాం కర్తవ్యం.

**ఇచ్చిన 'గనుల' నుంచే రాజకీయ లబ్ధి త్రవ్వి తీసుకోవాలి!**

చూడడానికి చిన్నగాలిగా కన్పించినప్ప

—కొరవ 6 పేజీలో

# పాముకు పాలు పోస్తే కాటేయకుండా వుంటుందా?

పాలుపోసినంతమాత్రాన పాముకాటేయకుండా వుండదు; సింహాసనంపై కూర్చోబెట్టి అక్కున చేర్చుకున్నా కొందరు "విషకలగుణం" మానలేరని పెద్దలు చెప్పిన మాట నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారి విషయంలో అక్షరాలా నిజమైంది. [illegible] గుండెపోటుకు గురైన శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి హైదరాబాదు [illegible] ఆస్పత్రిలో చేరారనేదిదికాదు. ఆయన [illegible] 'పేమ [illegible]!' అని [illegible] కోలుకుంటున్నారని 'ఉదయం' [illegible] ఎవరూ చెప్పకుండానే, ఎవరూ పిలవకుండానే ముఖ్యమంత్రి ఆయన్ను పరామర్శించడానికి 7 తేది ఆస్పత్రికి వెళ్ళారు. పాత మిత్రులిద్దరూ పదిహేను నిముషాలపాటు పిచ్చాపాటి మాట్లాడుకున్నారు; కళలు పన్నాగాలు వేసుకున్నారు. జమీన్‌రైతు వజ్రోత్సవాలలో పాల్గొనడానికి రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ నెల్లూరు వస్తున్నారని శీనయ్యతో చెప్పారు జనార్దనరెడ్డి; అంతా బాగానే వుంది.

కాని ప్రక్కరోజు ఉదయమే ఆస్పత్రి

—కొరవ 6 పేజీలో

## జమీన్‌రైతు

# ఎరువుల ధర

ఎరువులధర తగ్గింపువిషయంలో ఆర్థికమంత్రి డాక్టర్ మన్‌మోహన్ సింగ్ అవలంబిస్తున్న దృతపై ఖరి విదారకరమైనది; గర్హించదగినది. మన ఆర్థికవేత్తలకు రైతులపట్ల ఎంతమాత్రం సానుభూతి వుండేది, రైతు సమస్యలపట్ల ఎంతపాటి అవగాహన వుండేది ఎరువుల ధర విషయంలో మన్‌మోహన్ సింగ్ వైఖరిని చూస్తేనే అర్థమైపోతున్నది. వ్యవసాయంపట్ల కనీసపరిజ్ఞానంలేని సిద్ధాంత కర్తలు రూపొందించే విధానాలపై రైతుల భవిష్యత్ ఆధారపడడంకంటే ప్రమాదకరమైనవిషయం వేరొకటుండదు!

దేశం ఆర్థికంగా దివాలాతీసేపరిస్థితులలో ఎరువులపై 7 వేల కోట్లు సబ్సిడీ ఇవ్వడం తన తరంకాదని ఆర్థికమంత్రి అభిప్రాయం. కాని, ఈ సబ్సిడీవల్ల రైతాంగం దేశానికి మిగిల్చే విదేశీమారకద్రవ్యం ఎన్నివేలకోట్లు వుంటుందో ఆయన లెక్కకట్టడంలేదు; వ్యవసాయం దెబ్బతిని, ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడితే ఆర్థికంగా, సాంఘికంగా దేశంలో ఎటువంటి విషమపరిస్థితు లేర్పడురాయో ఆయన ఊహించడంలేదు; ఆహారధాన్యాల ఎగుమతుల నిషేధంవల్ల రైతులు నష్టపోతున్నది ఎన్నివేలకోట్లో ఆయన పరిగణనకు తీసుకోవడంలేదు.

అసలు వ్యవసాయఖర్చులు, ఉత్పత్తివ్యయం, ధాన్యంధరలను పోల్చిచూసినా, ఆర్థికమంత్రి ఇంతటి తీవ్రనిర్ణయం తీసుకొనేవాడు కాడేమో! పదేళ్లనుంచి ఎరువుల ధరలు పెరగనిమాట వాస్తవమే కాని– కరెంట్ ఛార్జీలు, డీసల్‌రేటు, ట్రాక్టర్ బాడుగ, కూలీరేట్లు ఎంత పెరిగిపోయాయి? పాతికరూపాయల కూలి యివ్వడం ఒక భారమైతే, ఇదివరకు ఐదుగురితో జరిగేపనికి ఇప్పుడు పదిమంది లేనిదే జరగకపోవడం పెద్దసమస్యగావుంది. కొన్నిగ్రామాలలో ఎంత కూలీ ఇచ్చినా మనుషులు దొరకడంలేదు; దొరికినా పనిచేయడంలేదు! కూలీల వేటలో రైతు ఆత్మగౌరవం దెబ్బతినిపోతున్నది: రైతంటే విలువ లేకుండాపోతున్నది. ఈ పదేళ్లలో ఖర్చులు 300 శాతం పెరిగితే, ధాన్యంధర 100 శాతం కూడా పెరగలేదు. వేరే బ్రతుకుతెరువులేక, గతిలేక రైతు సేద్యంపై ఆధారపడివున్నాడు కాని, లేకుంటే– ఒక్క క్షణం ఆ వృత్తిలో నిలవడు. ఆర్థికంగా ఆదాయం, సాంఘికంగా గౌరవంలేని పరిస్థితులలో రైతు వ్యవసాయం ఎందుకు చేయాలి? దేశానికి అన్నం ఎందుకు పెట్టాలి?

ప్రతిపక్షాల ఆందోళనకు జడిసి, కన్నీటితుడుపుగా పెంచిన ధరను 10 శాతం తగ్గించింది కేంద్ర ప్రభుత్వం. అదీ చిన్నకారు రైతుకేనట. భూసంస్కరణల అమలు తర్వాత పెద్ద రైతు అనేవాడు ఎక్కడున్నాడో ప్రభుత్వానికే తెలియాలి! పుట్టి వడ్లు పండించేందుకు ఉత్పత్తివ్యయం చిన్నరైతుకైనా, పెద్దరైతుకైనా ఒకటే అయినప్పుడు– కొందరికి మాత్రమే ధర తగ్గించి ప్రయోజనమేమిటి? పెద్దరైతులు వ్యవసాయం మానుకోవలసిందేకదా? ఈ తేడావల్ల అవినీతిని ప్రోత్సహించడంతప్ప, ప్రభుత్వానికి జరిగేమేలు మరేదీవుండదు.

ప్రభుత్వం ఆర్థికసమస్యలతో వున్నప్పుడు అన్నిరంగాల ప్రజలకూ సమానమైన నిష్పత్తిలో ఆ నష్టాన్ని పంచడం సముచితం. రైతుల నోరుకొట్టి పారిశ్రామికవేత్తల బొజ్జలు పెంచినందువల్ల దేశం బాగుపడదు. ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు కూడా రైతు బిడ్డే. రైతుల సమస్యలు తెలిసినవాడే! ఆయన తక్షణం జోక్యంచేసుకొని, పెంచిన ఎరువులధర (40 శాతం) లో చిన్న పెద్ద తారతమ్యం లేకుండా అందరికీ కనీసం 20 శాతం తగ్గించడం అవసరం. విదేశాలనుంచి దిగుమతిచేసుకొనే ధరనే దేశీయంగా ఉత్పత్తయ్యే ఎరువులకూ నిర్ణయించి, సబ్సిడీలు లెక్కవేయడంకంటే– భారతీయ ఎరువులకు న్యాయమైనరేటు నిర్ణయిస్తే, రైతుకు న్యాయం జరుగుతుంది; సబ్సిడీల భారమూ తొలగుతుంది. దిగుమతుల ధరను స్వదేశీ ఉత్పత్తులకు తెచ్చినట్లైతే పడి, పడిపోను పరిశ్రమలను పోషించడంకోసం కోట్లాది రైతులను నష్టపరచాలా?

రైతుల సమస్యలందు ఏ మాత్రం తెలియని మన్‌మోహన్ సింగు వాస్తవపరిస్థితులు వివరించి, వ్యవసాయ పట్ల ఆయనలో పేరుకొనిపోయిన దురభిప్రాయాలను తొలగించడం పార్లమెంట్ సభ్యుల కర్తవ్యం.

---

## జమీన్‌రైతు

8-8-1941

10 పేజీలు అణా

### ఎలికల్లువారి అక్రమము యార్లగుంటపై అంటీ

వెంకటగిరి దివాణములో జేరిన యార్లగుంట అగ్రహారం చెరువు బాగునకు, ఎలికంటి రైతులు అదివిరెడ్డిగారి సలహా ననుసరించి అడ్డుకట్ట వేసి ప్రక్క గుంటకు వాగును త్రిప్పిరి. కారణం యార్లగుంటలోవుండే పేద జంగాలు ఎలికంటి రైతులకు సమానముగా వర్తించుచున్నారని, అనగా జంగాలు మంచాలమీద, అరుగుల బల్లల మీద కూర్చోరాదనీన్నీ, దుడుద్దేశ్యముతో వారిని లోపరచుకొనుటకై ఎలికంటికి యార్లగుంట వారెవరూ రాకూడదని ఎవరింటికి వచ్చినవారు 5 రు. అపరాధము ఇచ్చుకోవాలని పనివాటల వారు కూడా వారితో మెలగరాదని ఆదిపిరెడ్డిగారు గ్రామంలో ఆంక్షను ప్రయోగించారట. అవాగు ఎలికంటి కంబెలోనుండి వచ్చునది. అవాగుకంటే యార్లగుంట చెరువునకు వేరేగతి మొఖాలేదు. ఏ మహానుభావుడైనా బాగుచేయదలచినారా?

### కలరా

జూలై 17 తో ప్రారంభించి, నెలాఖరులో ఆగింది. మొత్తం తగిలిన కేసులు 88. ఇందులో చనిపోయినవారు 16 మంది. ఈ సమయంలో కష్టపడి కలరాను అరిమికొట్టిన బెంక్ మేజా, పెద్దన్న అను మా ఆభినందనము.

### యానది హాస్టలుకు రాజేంద్రబాబు రూ 250 లు

నెల్లూరు యానాది హాస్టలుకు బాబు

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

రాజేంద్రప్రసాదుగారు రూ 250 లు విరాళం పంపారట. దానికి ఉబ్బిన వ్యాధి త్వరలో నెమ్మది యగుగాక యని యానాదిపిల్లలు భగవధ్యానం చేస్తారు.

### రవీంద్రుని అస్తమయం

(సంపాదకీయం)

నిన్న మధ్యాహ్నము ప్రపంచమంతయును నశ్రుధారలు విడుచుచుండ రవీంద్రుడు భౌతిక శరీరము దాని విడు తమరుంచు లీకన యిజరి పంచభూతములు మునిగవచ్చును. తనకు కోగలవి వచ్చినాడని కీర్తి గాంచి అనంతించ దచ్చును. లో తీక తేజస్సమును వదలి యశోదం ప్రకలు సకలసీత్రమునుపీర ల్యంతటి మగవడ్డ రంపవచ్చును. తన మనుగతమ గొప్ప వలాటి అంతటమలేద సూర్యాదివది శాశ్వతమూ దీను తమైన రవీంద్రుని దివ్యతేజము సంగ దీప వచ్చును.

తల్లి పదులు జనింప వచ్చు యుద్ధాన కేవలం దయాపేక్షదు రాజ నీతికోవిదులు విరాజిల్లవచ్చు; కావ్య పారంగతులు వచ్చు. కాని అందరూ ఒకటి, అగస్త్యకొంటి అని అరోకి–అందరూ ఒకటి, రవీంద్రుడు ఒకటి. కాలగర్భమున నన్నియును మాయమగును. మానవునిచే మరువబడును; గాని విజ్ఞాన తేజమట్టిదిగాదు. దానిని అడ్డుపెట్టువాడు లేడు. విద్యగలవాని కెదురు విందలేదన్నాడు కవిపుంగవుడు. త్రికాలవేత్త కవీశ్వరుడు, సర్వకాలజ్యోతి కనుక కవీశ్వరునకు మరణములేదు వ్యక్తిగత భౌతిక శరీరము అదృశ్యముకావచ్చు. రవీంద్రునికి మరణమెక్కడిది? విరూపమున మనము రవీంద్రుని పరిచయము చేసుకొంటిమో, ఆ రూపమునకు వినాశికి చలనములేదు.

---

# వెన్నెముక విరగగొట్టకండి!

అందరి ఆకలితీర్చే రైతు కడుపు కొట్టడం దేశానికి వెన్నెముకను విరగొట్టడమే కాగలదు ఇంటిల్లిపాదీ, ఏడాదిపొడుగునా రేయింబవళ్లు రెక్కలు ముక్కలు చేసుకొని చివరకు పంట అమ్ముకునేనాటికి అప్పులపాలై, వచ్చేధరకాదు లకు అతి తక్కువధరకు కల్లాలలోనే తెగనమ్ముకుంటున్నారు కూలీరేట్లు పెరిగి, వ్యవసాయఖర్చులు పెరిగి యిప్పటికే క్రుంగిపోయిన రైతుమీద పెరిగిన ఎరువుల ధరలను రైతుకు అందుబాటులోకి తెచ్చి ఆదుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

నెల్లూరు —బి పట్టాభిరామయ్య

### రైతుపై ఇది కేంద్ర ప్రభుత్వ దాడి

పల్లెల స్థితిగతులు, వ్యవసాయరంగ మెరుగొక్కంటున్న క్లిష్టపరిస్థితులూ తెలిసి కూడా, కేంద్రప్రభుత్వం ఎరువులపై సబ్సిడీని రద్దుచేసి భారతదేశపు రైతు వెన్నువిరిచేసింది.

ఈ నాడు పెద్దరైతు వున్నభూమిని గొనేదిక్కులేక, సాగుచేసే కలిలేక పూల

### జనవాణి

మ్మిన పూరిలో కష్టైనా అమ్మలేక దుర్భర జీవితం గడుపుతూవుంటే, ఎరువుల ధర మండిపోవడమంటే గోరుచుట్టుమీద రోకలిపోటు వంటిదే. ప్రభుత్వానికి రైతాంగమంటే ఇంత కక్ష ఏమిటా అనిపిస్తున్నది.

—ఈపూరు వెంకురెడ్డి
గుడ్లూరివారిపాలెం

### జమీన్‌రైతు వజ్రోత్సవం మహదానందదాయకం

ఈ నెంలో జమీన్‌రైతు వజ్రోత్సవాలలో పాల్గొనేందుకు భారతరాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్‌గారు విచ్చేస్తున్నారని తెలిసి నా మనస్సు సంతోషంతో ఉప్పొంగిపోతున్నది. అరవై రెండేళ్ల పయనంగం జమీన్‌రైతుపత్రిక వజ్రోత్సవాలకు రాష్ట్రపతిరాక సింహపురి ప్రజలకేగాక, దేశ విదేశాల్లోవున్న తెలుగు వారందరికీ గర్వకారణం.

జమీన్‌రైతు వజ్రోత్సవాలు కాస్త అలస్యంగా జరుగుతున్నా, చరిత్రాత్మకంగా నిలిచిపోగలవని ఆశిస్తున్నాను.

నెల్లూరు -జె. పోలిరెడ్డి

—కొరవ 9 పేజీలో

---

# నెల్లూరు రాజకీయాల్లో
## విచక్షకుడు

### చింతా మోహన్

కేంద్ర ఎరువులు, రసాయనాలమంత్రి శ్రీ చింతా మోహన్ 10 తేదీ ఉదయం మద్రాసు మీదుగా తడకు వస్తున్నారు. తడ, సూళ్ళూరుపేట, శ్రీహరికోట రాకెట్ కేంద్రం, పొదలకూరు సందర్శించి రాత్రికి తిరుపతికి వెళ్తారు.

### జానకిరాం తొలిపర్యటన

రాష్ట్ర గనులు, భూగర్భగనుల శాఖ మంత్రి శ్రీ మాగుంట జానకిరాం 14 తేదీ సాయంత్రం మద్రాసునుంచి నెల్లూరు వస్తున్నారు. మంత్రిగా జానకిరాం తొలి పర్యటన ఇది. అందువల్ల ఆయన స్వాగతానికి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నారు. రైల్వేస్టేషన్ నుంచి ఊరేగింపుగా తీసుకువచ్చి ఇందిరాభవన్ లో సత్కరిస్తారట.

14 నుంచి 18 తేదీవరకు జానకిరాం జిల్లాలోనే వుంటారు. స్వంత నియోజకవర్గంలో పర్యటిస్తారు.

### ఠాగూర్ జయంతి

విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్ జయంతిసభ 7 తేదీ సాయంత్రం టౌన్ హాల్ లో జరిగింది. సినీనటుడు శ్రీ కొంగర జగ్గయ్య విశ్వకవీంద్రుడిపై అద్భుతమైన ప్రసంగం చేసి, శ్రీ పి. వి. రమణారెడ్డి గారు తనతల్లి స్మృత్యర్థంగా జరిపే సన్మానం స్వీకరించారు. డాక్టర్ జెట్టి గోపాలరెడ్డిగారు సభనధ్యక్షత వహించారు.

జగ్గయ్యగారి ప్రసంగం రవీంద్రుడి సమగ్ర స్వరూపాన్ని సభికుల ఎదుట ఆవిష్కరింపజేసింది. సవివరంగా పై వారం ముచ్చటించుకుందాం!

### వి. ఆర్. కాలేజి దిగజారిపోయింది!

వి ఆర్ కాలేజికి తమ హయాంలోనే, తమ చేతులమీదుగానే నిర్ణయించాలి. అలా తర్జనభర్జనలనే పట్టుదలతో వున్నట్లుంది యాజమాన్యం; నూరేళ్ళ చరిత్ర గల్గిన ఈ విద్యాసంస్థకు "నూరేళ్లూనిండే" ట్లు చేయాలని కాకత్రయపదుతున్నట్లుంది. వీరి ఈ దిగజారుడు దోరణికి పరాకాష్ఠ- మొన్న 7 తేదీ ప్రిన్సిపల్ శ్రీ కె సుందరరామిరెడ్డిపై జరిగినదాడి.

సుందరరామిరెడ్డిగారు ప్రిన్సిపల్ గా బాధ్యత స్వీకరించిన నాటినుంచి అరాచకమయంగా వుండిన కాలేజిని దారిలో పెట్ట డానికి ప్రయత్నిస్తున్నారు కీలుబొమ్మ వంటి ప్రిన్సిపల్ ను పెట్టుకొని, లక్షలకు లక్షలు కాలేజి నిధులు గుటకాయస్వాహా చేస్తుండిన యాజమాన్యానికిది కంటగింపుగా తయారైంది. అధ్యక్షుడు శ్రీ ఆనం భక్తవత్సలరెడ్డి విదేశ పర్యటనకు వెళ్ళడంతో ఇక్కడి పూజారులు ప్రిన్సిపల్ నేమీ చేయలేకపోయారు. భక్తవత్సలరెడ్డిగారు నెల్లూరు రాగానే వీరికి ఎక్కడలేని బలంవచ్చింది. ఈ నాలుగునెలల కాలంలో ప్రిన్సిపల్ చేసిన పలుఉత్తర్వులను రద్దుచేయించారు. అప్పటికీ ఆయన కొరకరాని కొయ్యగా వుండడంతో, విద్యార్థులనబడే రౌడీ మూకను పోగుచేసి, 7 తేదీ ఉదయం ఆయన గదిపైకి దాడిజరిపించి, బీరువా విరగొట్టి, ఆయన్ను అవమానపరిచారట. ఆ వేదిలో ఆ మూక లేబరేటరీని సైతం ధ్వంసం చేసింది యాజమాన్యం ప్రోత్సాహంతో. ఈ దుర్ఘటనపై రాష్ట్ర విద్యాశాఖ కార్యదర్శికి, పోలీసులకు ఫిర్యాదు పంపారట. దౌర్జన్యం చేసే భయపడి ప్రిన్సిపల్ సెలవుపై వెళ్ళిపోతాడని యాజమాన్యం ఉద్దేశంగా వున్నట్లు దీనికి కారణం. క్యాంటీన్ కు పోవడానికి గేటు తెరవనందు వల్ల క్యాంటీన్ యజమాని నష్టపోతున్నా డనిఅట

ఏ కాలేజి యాజమాన్యమైనా ఇంత కంటే దిగజారడంగా, ఇంతకంటే నీచంగా ప్రవర్తించగలదని ఊహించలేము. ప్రిన్సిపల్ మొండివాడుగాబట్టే ఈ దాడిని భరించి కూడా కాలేజికి వస్తున్నాడు. విద్యార్థులు ఆయన్ను సమర్థిస్తున్నారు.

వి ఆర్. కాలేజి వంటి చారిత్రాత్మక సంస్థ ఇటువంటి అపసోపాలు, సంస్కార హీనుల యాజమాన్యంలో వుండడం సంస్థకే అవమానం. ప్రభుత్వం తక్షణం జోక్యంచేసుకొని కాలేజీ వ్యవహారాంపై సమగ్ర దర్యాప్తు జరిపించి, కాలేజిని తన స్వాధీనం చేసుకోవడం అవసరం అది జరగకుంటే కాలేజిపేరేకాదు, రూపుకూడా మాసిపోతుంది.

### సంస్కృత హరికథ



సంస్కృతంలో హరికథ చెప్పగల్గిన ఒకేఒక తెలుగుమహిళ, అసాధారణప్రతిభా వంతురాలు, కుమారి డి ఉమామహేశ్వరి ఆగస్టు 16 తేదీ టౌన్ హాల్ లో జరిగే గీతగోవింద సభలో 'భక్తజయదేవ' సంస్కృత హరికథ చెప్పబోతున్నారు కుమారి ఉమామహేశ్వరి గోదావరి జిల్లా, కపిలేశ్వరపురంవాసి; హరికథలో ఆమెకు పోస్ట్ డిప్లొమా వుంది; రాష్ట్రపతి అవార్డు గ్రహీతకూడా. సాహిత్య సదస్సు ఆధ్వర్యంలో జరిగే కార్యక్రమమిది. ఈ సభలోనే ప్రసిద్ధ రచయిత శ్రీపతి సీతారామయ్య జయదేవుని గీతగోవిందంపై ఉపన్యసిస్తారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షిస్తారు.

### నెల్లూరు క్లబ్ కు నూతన కార్యవర్గం

నెల్లూరు క్లబ్ కు నూతన కార్యవర్గం ఎంపికైంది. ఎన్నిక ఏకగ్రీవం. అధ్యక్షుడుగా శ్రీ ఎన్. రామసుబ్బారెడ్డి, ఉపాధ్యక్షుడుగా శ్రీ డి. సాయిప్రసాదరెడ్డి, గౌరవ కార్యదర్శిగా శ్రీ పి జనార్ధనరెడ్డి కార్యవర్గ సభ్యులుగా శ్రీ ఎ. కుమారస్వామి (వి ఆర్ కాలేజి), డి. శివకుమారరెడ్డి, కె. శివకుమారరెడ్డి, ఎ. వి. కృష్ణారెడ్డి, పి. పద్మాకరరెడ్డి డి. భరత్ కుమార్ రెడ్డి, ఎం. అన్నయ్యచౌదరి, బి నరసింహారావు ఎన్నికైనారు.

గత సంవత్సరం కార్యదర్శిగా శ్రీ జనార్ధన్ క్లబ్ కు పట్టినగబ్బును చాలా వరకు వదలించారు. అదే ఉత్సాహంతో ఈ ఏడాదీ పనిచేస్తే క్లబ్ చాలినవరకుంది.

### విదేశీయానం

కర్లపూడికి చెందిన సన్నారెడ్డి కృష్ణారెడ్డి కుమారుడు హరికృష్ణారెడ్డి అమెరికాలోని నార్త్ కరోలినా విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసానికి 8 తేదీ బయలుదేరారు హరికృష్ణారెడ్డి బి.టెక్ లో చిదంబరం యూనివర్సిటీ ప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు అతనికి మా శుభాకాంక్షలు!

### స్వర్ణ ఫైనాన్స్ కేసు

స్వర్ణ ఫైనాన్స్ పేరుతో డిపాజిట్లు సేకరించి కోట్లాది రూపాయలకు కుచ్చుల టోపీ పెట్టిన బోర్డు మోసగాళ్ళపై దర్యాప్తు జరిపించే బాధ్యతను బోర్డు హైకోర్టు సిబిఐకి అప్పచెప్పింది. నెల్లూరులోనూ ఈ సంస్థ దాదాపు 40 లక్షల రూపాయలు దోచుకున్నది. ఇట్లా నష్టపోయినవారు సిబిఐకి తమ తమ వివరాలు పంపుకోను-కార్యదర్శి, స్వర్ణ ఫైనాన్స్ డిపాజిటర్స్ అసోసియేషన్. 20/697 వక్తేలాపేట నెల్లూరు-524003 అన్న చిరునామాతో సంప్రదించవచ్చు

### గిల్టు నగలకోసం నడివీధిలో హత్య

నెల్లూరు, సంతపేట నాలుగుకాళ్ళ మండపం దగ్గర 6 తేదీ రాత్రి ఏడున్నర గంటల ప్రాంతంలో సుబ్రహ్మణ్యం అనే వ్యక్తిని, ఒక దొంగ దారుణంగా పొడిచి చంపాడు. నడివీధిలో జరిగిన ఘోరదుర్ఘటన ఇది.

సుబ్రహ్మణ్యం, కోవూరు మండలం, వేగూరు గ్రామస్థుడు. భార్యతో కలిసి నెల్లూరుకు వచ్చి సెకండ్ షోసినిమాచూసి తిరిగి వెళ్తుండినాడట. సంతపేటదగ్గరకొచ్చేసరికి వెనుకనుంచి ఒక దొంగ ఆమె మెడలోని సరడు పెరుక్కోబోయాడట. సుబ్రహ్మణ్యం వాణ్ని ప్రతిఘటించబోయేసరికి, వాడు కత్తితో అతడి ఛాతిపై పొడిచి పారిపోయాడట. ఆస్పత్రికిచేర్చేలోగానే అతడి ప్రాణంపోయింది. ఇంతకీ, ఆ కిరాతక దొడుడు పెరుక్కోన్నవి గిల్టునగలు; పాతిక రూపాయల విలువకూడా చేయవు.

నెల్లూరు టౌన్ రాను రాను ఎంత అరాజకమయంగా తయారౌతున్నదో తెలుసుకోవడానికి ఈ దుర్ఘటనే సాక్ష్యం. ఇటువంటి ఘోర సంఘటనలలో సైతం చురుకుగా పనిచేసి, నిందితులను పట్టుకోవాలన్పించదా పోలీసులకు!

### పప్పులవీధి హత్య

నెల్లూరు పప్పులవీధిలో 2 తేదీరాత్రి కొంగా లక్ష్మీకాంతమ్మ (60) అనేవృద్ధురాలిని ఆమె ఇంట్లోనే దారుణంగా హత్యచేశారు. లక్ష్మీకాంతమ్మ తన ఇంటి కింది భాగం బాడుగకిచ్చి, మిద్దెపైన పెద్దకుమారుడితో కలిసి వుంటున్నారు. 2 తేదీ రాత్రి ఆ యువకుడు సెకండ్ షోకి వెళ్ళాడట అర్ధరాత్రి 12 గంటల సమయంలో ఎవరో వెనుకభాగంనుండి ఇంట్లోదూరి ఒంటరిగా వుండిన లక్ష్మీకాంతమ్మను గొంతుకులిమి చంపి, గాజులు, కమ్మలు మెడలోని చైను పెరుక్కొని పరారైనా

—తరువాయి 6 పేజీలో



### కావలి విద్యార్థిని ప్రతిభ

కావలికి చెందిన కుమారి ఇందిర అనే విద్యార్థిని సీనియర్ ఇంటర్మీడియట్ పరీక్షలలో రాష్ట్రంలో ద్వితీయస్థానంలో ఉత్తీర్ణురాలైంది. జిల్లా స్థాయిలో ఆమెకు ప్రథమ స్థానం లభించింది కుమారి ఇందిర, కావలి రావూస్ అకడమిక్స్ విద్యార్థిని; బంపతిరావుగారి శిక్షణ పొందిన ప్రతిభావంతురాలు.

# హీరోయిన్లే సెక్సీగావుంటే విడిగా సెక్సుతారలెందుకు?

రాఘవేంద్రరావు మాజీ ఆహ్వానం శ్రీదేవి పొల్గొన్నారు "420" అనే చిత్రం షూటింగ్‌లో మాట్లాడుకుంటూ చెప్పుకున్నారు. కుటుంబ కలహాల మూలంగా వాళ్ళిద్దరూ పరస్పరం మాట్లాడుకోక పోయినా ఓ పాత్రికేయుని ప్రశ్నకు మాత్రం ఇద్దరూ ఏక కంఠంతో ప్రత్యుత్తరమిచ్చారు. "రాఘవేంద్రరావుగారి చిత్రాల్లో సెక్సీ తారలే కెమెరా ముందుకు వచ్చి" అని ఆ పాత్రికేయుని ప్రశ్నకు 'ఇప్పుడు మా అవసరం లేదు. హీరోయిన్లే అర్థ నగ్న దుస్తుల్లో ఛందాలంగా డాన్సులు చేసేస్తుంటే, మా కెక్కడ షూటింగులు దొరుకుతాయి' అన్నారిద్దరూ. నిజమే ఇటీవల ఓ తార ఓ ప్రెస్ ఫోటోగ్రాఫర్‌తో "కాస్త సెక్సీగా తీయండి సార్!" అని తనే ప్రోత్సహించిందట. కాలమహిమ!

### "అర్చన ఐ. ఎ. ఎస్"

"మహాభారత్" టి.వి. సీరియల్‌ను చక్కగా తెనిగించిన కాకజాహన (గులాం నబీ) బహుభాషా పండితుడు. ఇతను రాసిన ఒక నవల ఒక తెలుగు పత్రికలో సీరియల్‌గా వెలువడి, విశేషంగా పాఠకులను ఆకట్టుకుంది. దీనిని ఒక నిర్మాత తమిళంలో "అర్చన ఐ.ఎ.ఎస్"గా తీశాడు. హిట్ అయింది. డబ్బింగ్ హక్కులకోసం ఎందరో పోటీపడ్డారు. చివరికి ఇద్దరు మహిళామణులు అత్యధిక మొత్తం చెల్లించి, కైవశం చేసుకున్నారు. గంగిగోవులాంటి సమాజంపై రెచ్చిపోయే కొందరు స్వార్థపరులకు గుణపాఠం చెప్పడానికి అర్చన అనే యువతి తన జీవితాన్ని పణంగా పెట్టి, అక్రమ పోషకుల కోసం రాజకీయ వేత్తలలో సంచలనం సృష్టించి, సమాజానికి మనుగడ ఎలా రాబట్టిందనేది

> ### మద్రాసు సినిమా వార్తలు

వస్తోంది ఇతివృత్తం. సితార, శ్రీవిద్య, శ్రీలక్ష్మి, యామిని, శరత్‌కుమార్, విజయకుమార్, జనకరాజ్ నటించారు. వి. జగన్నాథం దర్శకుడు. వై. హేమా అశోక్ రెడ్డి, ఎస్. భాగ్యయాదిరెడ్డి నిర్మాతలు.

### గోరుచుట్టుపై రోకలిపోటు

ఫిల్మ్ నెగెటివ్‌ని విదేశాలనుంచి మనం దిగుమతి చేసుకుంటున్నాం. రూపాయి విలువ పడిపోవడంతో చెల్లించవలసిన విదేశీ మారకం ఎక్కువై ముడి ఫిలిం నెగెటివ్ ధర ఇదివరకటి కన్నా షుమారు 48 శాతం పెరిగింది ఫిలిమ్ పాజిటివ్‌లో 32.6 శాతం పెరిగింది. గతంలో సేల్స్‌టాక్స్, అక్ట్రాయ్ లేకుండా 1000 అడుగుల 35 ఎం.ఎం. ఈస్ట్‌మన్ కలర్ రోల్ రూ 8,608 అయితే, ఇప్పుడు 12,049కి పెరిగింది. 24 ప్రింట్ల ధర 2 లక్షల నుండి 3 లక్షల 80 వేల వరకు పెరిగింది. ప్రస్తుతం ఖర్చే సర్వీసులో ఎక్కువభాగం ఈ పాజిటివ్ పెంపుదలకే పోతే, మిగతా రాయితీల సౌలభ్యాన్ని పెరిగిన ఫిలిమ్ నెగటివ్ స్వాహా చేసేస్తుంది. అందుకే చిత్ర పరిశ్రమ ఆందోళన చెందుతోంది. ఈ పరిస్థితిని అధిగమించాలంటే చిత్ర నిర్మాణ వ్యయం బాగా తగ్గించాలి. ఫిలిమ్‌ను పరిమితంగా వాడాలి. ఇందుకు తారల సహకారం ఎంతైనా అవసరం. ఆకాశానికి పెరిగిన తారల పారితోషికాన్ని తగ్గించడంలో నిర్మాతలందరూ సమిష్టిగా కృషి చేయాలి. పూర్తి స్క్రిప్టు సిద్ధంగా లేనిదే అసలు షూటింగ్ మొదలెట్టకూడదు. ఇలాంటి జాగరూకతలు వహించకపోతే ఇటువైపు చిత్రాన్ని నిర్మించడం లాభదాయకం కాదన్న విషయం నిర్మాతలకు తెలియనిది కాదు. మొత్తంమీద చిత్రనిర్మాణ వ్యయాన్ని అదుపు చేయడంలో కొన్ని మార్పులను ఎదురుచూడవచ్చు

—తరువాత 8 పేజీలో

# హిందీ 'ఖుదాగవా'లో అమితాబ్‌కు సైడ్ హీరోగా అక్కినేని నాగార్జున!

ముకుల్ ఆనంద్ దర్శకత్వంలో గ్లామర్ ఫిలిమ్స్ పతాకంలో తయారవుతున్న "ఖుదాగవా" హిందీ చిత్రంలో అమితాబ్‌తో పాటు నాగార్జున మరో హీరోగా నటించబోతున్నారు. అసలు నిర్మాతకు నాగార్జున పేరును సూచించింది అమితాబ్ బచ్చనేనట. పాత్ర నచ్చడంతో నాగార్జున వెంటనే అంగీకరించాడు. ఇతని సరసన శ్రీదేవి నాయిక.



సింధూరదేవిలో బేబీ షామిలి

### రాజీవ్‌రత్న ఎంటర్‌ప్రైసెస్

తాను రాజకీయరంగంలో ప్రవేశించడానికి ప్రోత్సహించిన తన ప్రియతమ నాయకుడు రాజీవ్ స్మృత్యర్థం ఆయన పేరున ఓ సంస్థ నెలకొల్పాడు కృష్ణ. ఒక రాజకీయ చిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఐతే, ఇందులో ఏ ఇతర పార్టీలమీద విసుర్లు వుండవట. కృష్ణ, వర్మ, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, బాలయ్య, డా. శివరామకృష్ణారెడ్డి, గిరిబాబు, ప్రదీప్ శక్తి వగైరా నటవర్గం. కూర్పు, నిర్మాత, దర్శకుడు : కృష్ణ.

★

## బహిరంగ వేలము

### కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వస్తువులు :

1) పి. నరేంద్రకుమార్ జైన్, పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 160 762-ఎ, గిరిపురం తిరుపతివారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 21-3-90 నుండి 18-8-90 వరకుగల విడిపించని వస్తువులు 17-8-90 తేది సాయంత్రం 4 గంటల నుండి 762-ఎ గిరిపురం తిరుపతిలో బహిరంగవేలం జరుపబడును.

2) షాతిసల్రాతిచంద్ అశోక్‌కుమార్ పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నంబరు 200 3వ లైను బ్రాడీపేట, గుంటూరువారి తాలూకు కాలపరిమితి గడచినప్పటికి 9-8-87 నుండి 28-10-89 తేది వరకుగల విడిపించనివస్తువులు 21-8-91 తేది ఉదయం 10 గంటల నుండి బ్రాడీపేట 3వ లైను గుంటూరులో పై అడ్రసుగలవారి అంగడిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) శ్రీలక్ష్మి బాలాజీ పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 3/81-83 10-559-5 సంతపేట నెల్లూరువారి తాలూకు కాలపరిమితి గడచినప్పటికి విడిపించని వస్తువులు 24-8-91 తేది ఉదయం 10 గంటల నుండి 10-559-5 సంతపేట నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

4) శ్రీ అంబికా పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 20-1-262 కొర్లగుంట తిరుపతివారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5-1-88 తేది నుండి 19-8-89 తేది వరకుగల విడిపించని వస్తువులు 26-8-91 తేది ఉదయం 10 గంట 20-1-262 కొర్లగుంట తిరుపతిలో బహిరంగవేలం జరుపబడును.

5) యం. జీవన్‌లాల్ సింగ్వి పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 198 119 నేతాజీరోడ్డు తిరుపతివారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8-7-87 తేది నుండి 9-6-90 తేది వరకుగల విడిపించని వస్తువులు 28-8-91 తేది ఉదయం 10 గంటల నుండి 119 నేతాజీరోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) యం. సంపత్‌లాల్ సింగ్వి పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 298 16-1-119 నేతాజీరోడ్డు తిరుపతివారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8-8-89 నుండి 28-6-90 తేది వరకుగల విడిపించని వస్తువులు 26-8-91 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 16-1-119 నేతాజీరోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) మంగల్‌చంద్ పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 160 108 ప్రకాశం రోడ్డు తిరుపతివారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 19-9-88 నుండి 17-8-90 తేది వరకు గల విడిపించని వస్తువులు 29-8-91 తేది ఉదయం 10 గంటల నుండి 10-8 ప్రకాశం రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలం జరుపబడును (మంగల్‌చంద్)

8) యం. భవర్‌లాల్ పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 9 నం. 960 చిత్తూరు రోడ్డు పెనుమూరువారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 8-3-90 నుండి 24-6-90 తేది వరకుగల విడిపించని వస్తువులు 30-8-91 ఉదయం 10 గం. నుండి 9 చిత్తూరురోడ్డు పెనుమూరులో బహిరంగవేలం వేయబడును.

9) పార్వతి పాన్ బ్రోకర్స్ పి.బి.ఎల్. నం. 10 బజారువీధి పూతలపట్టువారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 19-9-89 నుండి 9-1-90 తేది వరకుగల విడిపించని వస్తువులు 30-8-91 తేది సాయంత్రం 4 గంటల నుండి నం. 10 బజారువీధి, పూతలపట్టులో బహిరంగముగా వేలం జరుపబడును.

—కె. వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలందారు
11/368, సంతపేట, నెల్లూరు

## కత్తికి వున్న బలం కలానికి లేదంటున్న

# అతిరథుడు

> ### చిత్ర సమీక్ష
> ★
> గిద్దలూరు గోపాలరావు

మనం చూస్తూనేవున్నాం. ప్రజాక్షేమం కోసం ఏర్పరచుకున్న ప్రజారాజ్యం మన కళ్ళముందే కసాయిరాజ్యంగా మారిపోతూవుంది. దీనికి కారణం మానవుల్లోని మానవత్వం మంటగలిసిపోవడమే. ఎక్కడ చూస్తే అక్కడ స్వార్థం, ఎక్కడపడితే అక్కడ కక్కుర్తి పెరిగిపోవడం. ఈ ప్రపంచం యావత్తూ తనకోసమే అన్నట్టు, అంతా తనకే స్వంతంకావాలన్న ఆరాటం మనిషి మనిషిలో వికటాట్టహాసం చేయ్యటం.

పంచాయితీ ప్రెసిడెంటు మొదలు అత్యున్నత పదవిలోవున్న వారివరకు వీరిలో ఎంతోమంది దేశాన్ని దోచుకోవటంలో బాగాఅలవాటుపడిపోయారు. క్రింది ఉద్యోగిమంచి ఉన్నతోద్యోగి వరకు అవినీతిలో నిర్భీతిగా ఆరితేరిపోయారు. పదవీ వ్యామోహంలో రాజకీయరంగం పెద్ద విషవలయమైంది. గూండాలదే రాజ్యంగా మారిపోయింది. అధికారం, పదవి, రాజకీయం, గూండాయిజం ఇలాంటివి ఇంకా ఎన్నో ప్రజాశత్రువులయ్యాయి. వీటిని గురించి, వీటికి సంబంధించిన దుష్టశక్తులను గురించి జర్నలిస్టులు పత్రికాముఖంగా తీవ్రంగా విమర్శిస్తూనేవున్నారు. కవిపండితాలంతో వీరి దుర్మార్గాలను ఖండిస్తూనేవున్నారు. అయినా యీ దేశద్రోహులకు చీమకుట్టినట్టుగాకూడా లేదు. ఈ స్వార్థపరుల్లో మార్పురావడంలేదు. ఇలా వ్రాస్తే వ్రాసుకోనీ, అటూ తుడిచిపారేసి, తమ నీచ ప్రవృత్తితో బ్రతుకుతూనే వున్నారు.

దీన్నిబట్టిచూస్తే వీరినిమార్చేందుకు, అన్యాయాలను, అక్రమాలను అంతమొందించేందుకు కలంబలం చాలదనుకోవాలా? లేక కలంపోటు బలంగాను సంఘటితంగాను ప్రయోగించనందువల్లనే దుష్టశక్తుల్లో మార్పు జరగటంలేదనుకోవాలా?

సుధాకరరెడ్డి, ప్రభాకర్లు నిర్మించిన "అతిరథుడు" చిత్రంలో దేశద్రోహులను ఎదుర్కొనేందుకు కలం బలం చాలటం లేదన్నట్టుగా చెప్పబడింది. తేజ (కాను చందర్) అనే యువజర్నలిస్టు తన కలం బలంతో దోపిడివర్గంపై విజయం సాధించలేక, కలాన్ని ప్రక్కనపెట్టి కత్తిని చేపట్టి ప్రజాశత్రువులను హతమారుస్తాడు యీ చిత్రంలో. నేరస్తులను శిక్షించటంలో న్యాయస్థానాలు విఫలమైనచోట తేజ తన కత్తితో ఆ నేరస్తులకు శిక్ష విధించి న్యాయం చేకూరుస్తాడు.

ఒక యువజర్నలిస్టు ప్రజాక్షేమం కోసం కలాన్ని వదలి కత్తిని ఆయుధంగా వాడటం సమంజసంగాలేదు. కలానికివున్న బలం కత్తికి లేదని తెలుగుసినిమా నిర్మాతలకూ దర్శకులకూ తెలుసు. కాని తెలుగు సినిమా హీరో చేతిలో కత్తికే బలం ఎక్కువనిగూడా వారికి తెలుసు, హీరో కత్తి చేతబట్టి శత్రువులమీదికి అంటే విలన్లమీదికి విజృంభిస్తేకాని ఆ సినిమాకు మంచి పట్టు చిక్కదు. అందుచేతనే తెలుగు సినిమా వాళ్ళంతా, దుష్టశిక్షణకోసం హింసామార్గాన్నే అనుసరిస్తున్నారు.

ఇక ఈ విషయం వదిలేసి చిత్రం పోకడనుగూర్చి ఆలోచిస్తే, యస్. గోపీకృష్ణ వ్రాసిన కథలో బలంలేదు. కొత్తదనంలేదు దర్శకుడు ఎ. చంద్రశేఖర్ కథనంలో మంచి మలుపులు త్రిప్పి చిత్రాన్ని వేగంగా నడిపించారు. ఒక జర్నలిస్టు కలం వదిలి కత్తిపట్టే దుశ్చర్య తీవ్రమైన పరిస్థితులను చక్కగా చిత్రీకరించారు దర్శకుడు. ఇక తెలుగు చిత్రాల్లో మామూలుగా కనిపించే ఆక్షన్లు, అంటే డాన్సులు, ఫైటింగులు, శృంగారం వగైరా

—తరువాత 8 పేజీలో

# ఆహ్వానము



# నెల్లూరు క్లబ్

దర్గామిట్ట-నెల్లూరు.

నెల్లూరు క్లబ్ నూతన భవన సముదాయమునకు

మాజీ ఉత్తర ప్రదేశ్ గవర్నర్

## శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు

**15-8-91 తేది రాత్రి 8-30 గం॥కు**

**ప్రారంభోత్సవం గావింతురు.**



పై కార్యక్రమమునందు సర్వశ్రీ

**దేగా నారసింహారెడ్డిగారు**
జి.ప్ర.ప. ఛైర్మన్

**ఆనం రామనారాయణరెడ్డిగారు**
మాజీ ఆర్ అండ్ బి మంత్రివర్యులు

**జె. కె. రెడ్డిగారు**
నెల్లూరు శాసన సభ్యులు

**టి. రమేష్ రెడ్డిగారు**
నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్

ముఖ్య అతిథులుగా పాల్గొందురు.

శ్రీ పి. జనార్దనరెడ్డి
గౌరవ కార్యదర్శి

శ్రీ ఎన్. రామసుబ్బారెడ్డి
అధ్యక్షులు

శ్రీ డి. సాయి ప్రసాద్ రెడ్డి, ఉపాధ్యక్షులు

— కార్యవర్గ సభ్యులు —

శ్రీ యం. టి. శేఖర్ రెడ్డి, శ్రీ ఎ. కుమారస్వామి, శ్రీ జి. దశరథరామిరెడ్డి
శ్రీ కె. శివకుమార్ రెడ్డి, శ్రీ ఎం. రామరాఘవరెడ్డి, శ్రీ డి. శివకుమార్ రెడ్డి
శ్రీ ఓ. భాస్కరయ్య శ్రీ యం. వెంకురెడ్డి

# శుభాకాంక్షలు



ఆనాడు ఆంధ్రసేనను నడిపించిన యువనాయకుడు.

ఈనాడూ ఆంధ్ర శాసనసభను తన వాగ్ధాటితో

గడగడలాడించ గల్గిన యువకిశోరుడు

## శ్రీ మాదాల జానకిరాం

ఆంధ్రప్రదేశ్. గనులు-భూగర్భశాఖామాత్యులుగా ప్రమాణస్వీకారంచేసి

తొలిసారిగా 14-8-91 తేది నెల్లూరు విచ్చేస్తున్న శుభతరుణంలో

ఉదయగిరి నియోజక వర్గంలోని వెలిగొండ రిజర్వాయరుతోపాటు

మొత్తం పెన్నా డెల్టా రైతుల అభివృద్ధికి కృషి చేయాలని

కోరుకుంటూ, వారికి మా హృదయపూర్వక

శుభాకాంక్షలు తెలుపుతున్నాము.

**సామంతు సుబ్బారెడ్డి**
మాజీ ఛైర్మన్-కోవూరు కో-ఆపరేటివ్ షుగర్ ఫ్యాక్టరీ

**పెళ్ళకూరు పెంచలురెడ్డి**
ముత్తాపురం

**డా॥ జి. కొండారెడ్డి**
డెంటల్ సర్జన్-నెల్లూరు

**కంటాబత్తిన సుధాకర్ రెడ్డి**
మండల కాంగ్రెస్ ప్రెసిడెంట్-సంగం

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press-Nellore.